శ్రీ

# జగన్నాథాభ్యుదయము.

ఇయ్యది,

పరమభాగవతోత్తముండగు

తోలేటి-

## సీతారామయ్యా పంతులుగారిచే

రచింపబడి

విశాఖపట్టణంబున

శ్రీ శారదామకుటముద్రాక్షరశాలలో

ముద్రింపబడి

ప్రకటింపబడెను.

1914.



శ్రీగణేశాయనమః.

శుభమస్తు-అవిఘ్నమస్తు.



# శ్రీగణనాథాభ్యుదయము.

(పూర్వభాగము.)



శ్రీవాణీచతురాస్యుల । శ్రీవనితాకేశవులను శీతాచలపు । త్రీవిశ్వేశుల నిరతము । సేవింతు మదీయకావ్యసిద్ధికి భక్తిన్ ॥ క॥ అజముఖవందితపదనీరజుజామరకర్ణునేకరదను గణేశున్ । గజముఖు భవహరుశర్వా । త్మజు గొల్తు మదీయకావ్యనిర్విఘ్నతకున్ ॥ క॥ సద్గుణమణిగణఖని భగ । వద్గీతాసారవేది వనజజనిభుఁడు । దృగ్గౌరవపూర్ణుండగు । మద్గురుని కొనర్తు శతనమస్కారంబుల్ ॥ ఆ॥ వె॥ పూర్వకవుల భక్తిపూర్వకంబుగ గొల్చి । వర్తమానసుకవివర్యులకును । వినయ మొప్ప మ్రొక్కి వివిధపండితసంఘ । మును నుతించి మిగుల మోదమలర ॥ సీ॥ మహిలోన మత్పితామహుడైనతోలేటి వేంకటేశ్వరుపాదపంకజముల । కంజలి జేసి సత్యవ్రి

తుండైన మజ్జనకుఁడు భాగయాఖ్యునిపదాబ్జ। ములకు హస్తయు
గంబు మోడ్చి మ్రొక్కి మదీయజనని సుబ్బాంబాంఘ్రిజలజము
లకు।వందనంబులొనర్చి వసుమతి నే నొక్క పుణ్యచరిత్ర మొప్ప
గ రచింప॥ గీ॥ తలచి యేకథ రచియింప ధాత్రి జన్మ। సఫలమగు
నని యోచించు సమయమందు। గొందరు మదీయమిత్రులానం
దమొప్ప।బరమమైత్రిగ ననుగాంచి పల్కిరిటుల।॥ క॥ శ్రీతోటే
టికులోద్భవ। సీతారామాభిధేయ శ్రీపతిపదకం। జాతధ్యానపరా
యణ। ఖ్యాతిగ రచియింపు మొక్క గ్రంథం బిపుడున్॥ క॥ అది
యే గ్రంథమటన్నన్। విదితముగ వచింతు మిపుడు విను గణనా
థా। భ్యుదయము సాకల్యంబుగ। సదమలమతి జెప్పవలెయు స
త్కవులెన్నన్॥ సీ॥ ధారుణిలోన దద్గ్రంథమున్నదిగదా మరల
నేటికటంచు మానసమున। దలపగావలువదు ధరణి రామాయ
ణకావ్య మనేకసత్కవులు వేరు। వేరుగా రచియించి విఖ్యాతి
నొందరే క్షితి దైవకథ లెన్నిగతుల నుడువ। దప్పుగాదిప్పుడు త
ప్పక నీవట్లు చెప్పిన నీప్సిత సిద్ధియగును॥ గీ॥ భూతలంబున స
త్కీర్తి బొందగలవు। సంతసించెద రవనిలో సకలజనులు। గాన
జెప్పుమటన్న నే గడుముదమున। జెప్పబూనితి దిద్దుడీ తప్పు
లున్న॥ క॥ శాంతునకున్ బరమకృపా। స్వాంతునకున్ భక్త
హృన్నిశాంతునకున్ ధీ। మంతునకున్ దైతేయకృ। తాంతున
కున్ విజయనగరహనుమంతునకున్॥ వ॥ సమర్పితంబుగా నా
యొనర్పంబూనిన గణనాథాభ్యుదయంబునకున్ గథావిధానం
బెట్టిదనిన॥౧౦॥ క॥ ఒకనాటి సమయమందున। సకలమునీశ్వరు

కథాప్రారంభము

లు నైమిశంబున సంతో। ష కలితహృదయాంబుజులై। ప్రక

టంబుగ సూతుఁగాంచి పల్కి-రివేడ్క-న్॥ క॥ వ్యాసప్రియశిష్యు
డ వితి। హాసపురాణాదివిదుఁడ వనఘుఁడవు తపో। ధ్యానుఁడ వా
ర్యస్తుతుఁడవు। నీసము లెవరింక నోమునిప్రవర భువిన్॥ గీ॥ కా
న నిపుడొక కథ వినగా గుతూహ। లంబు వొడమెను మామాన
సంబులందు। నదియు వివరింతు మిపు డతిహర్ష మెసఁగ। విని వ
చింపగదే మాకు వీనులలర॥ సీ॥ విఘ్నేశ్వరుని జన్మ విధము ద
చ్ఛిరము శంకరుఁడు ఖండించిన కారణంబు। దరువాతవానికి గరి
మస్తకముగూర్చి బ్రతికించినవిధంబు బద్మజాది। దేవతులతనికి ది
వ్యవరంబు లిచ్చిన హేతువును మరి శీతకరుని। కంబికాదేవి శా
పంబొసంగినరీతి వనజాక్షునకు నింద వచ్చినవిధి॥ గీ॥ పద్మలోచ
ను డానింద బాపికొనిన।భంగి జాంబవతీసత్యభామల భువి। జక్రి
హస్తుండు బరిణయమౌక్రమంబు। వివరముగ జెప్పవే మునిప్రవ
రమాకు॥ క॥ అనివేడిన నమ్మునివరు। లనుగని మిక్కిలి కుతూ
హలంబున సూతుం। డనియె మునులార మీరెరు। గనిసంగతు
లుండునే జగత్రితయమునన్॥ ౧౨॥ క॥ ఘన కారుణ్యముచేత
ను। నను బెద్దగ జేసి ముదమునను నావలనన్। వినగోరినారు గా
వున। వినిపింతు సవిస్తరముగ విఘ్నేశుకథ॥ వ॥ సావధాన
చిత్తులరై వినుండని పరాశరాత్మజుం ధ్యానించి మందస్మిత సుం
దర వదనారవిందుం డగుచు నమ్ముని బృందంబున కిట్లని చె
ప్పందొడంగె॥ క॥ గజదానవుండు పూర్వము। భుజగ విభూష
ణునిగూర్చి భూరితపంబున్। విజితేంద్రియుడై సల్పగ। ద్రిజగం
బులు దల్లడిల్లె దిక్పతులడలెన్॥ ఉ॥ అప్పుడు శంకరుండు క
రుణాన్వితమానసుడై యట శీఘ్రమున్। దప్పకవచ్చి యాద్విరద
దానవుముందర నిల్వగా నతం। డప్పరమేశుగాంచి వినయం

బున సాగిలి మ్రొక్కి సంతసం। బుప్పతిలంగ గేలుగవయున్ ము
కుళించి నుతించె నీగతిన్॥ భుజంగప్రయాతము॥ గిరీశా సురేశా
దిగీర్వాణవంద్యా। సరోజాతగర్భాదిసంస్తుత్యపాదా। పరేశా త్రి
శూలీ కపాలీ పురారీ। హరా శర్వ నాగేంద్రహారా మహేశా॥
౨౦॥ హరిగతిరగడ॥ జయజయ గిరిజాహృదయాంభోరుహ
చండకిరణ నతజనగణపోషణ। జయజయ విధిముఖసురవందిత
మృదుచరణసరోరుహ సర్వవిభూషణ। కమలాప్త నిశాకర శిఖి
లోచన కైలాసాచలకూటనివాసా। శమనస్మయవనపావక భ
వహర చంద్రజూటరవికోటివిభాసా॥ పంచచామరము॥ మురా
రి సన్నుతాంఘ్రిపద్మ మోక్షదాయకా మహే। శ్వరా మహో
క్షవాహ భక్తజాలపాలకా భవా! బురాశిశోషణా లసద్విభూ
తిలిప్తదేహ శై। లరాజకన్యకాపతీ లలాటనేత్ర శంకరా॥ క॥
అని వినుతింపగ శంకరు। డనుపమకారుణ్యచిత్తుడై వానికి ని।
ట్లనియె దనుజేంద్ర నీతప। మునకలరితి భవదభీష్టమును గోరు
మికన్॥ క॥ తప్పక నొసగెద ననగా। నప్పుడు గజదానవుండు
హర్షం బెడలో। నుప్పతిల హరునితో వా। డిప్పగిదిన్ విన్నవిం
చె నెంతయు భక్తిన్॥ క॥ ఇందుధర మదీయోదర। మందు గృ
హామతి వసింపు మనవరతము నీ। వెందు జనరాదు ధారుణి।
యందున నే బ్రతికియున్న యన్ని దినంబుల్॥ ౨౫॥ గీ॥ అనుచు
వేడంగ శంకరుండన్న మాట। తప్పగారాదటంచు నాతత్క్షణము
న। దనుజపతిగర్భకోటరమున వసించె। నంత నద్దానవుం డతి
హర్ష మొసగ॥ చ॥ తనపురి కేగి మిక్కిలిముదంబుననుండెను నిర్వి
చారుడై। మనసిజవైరి గానక నుమారమణీమణి మానసంబు
నం। దనుపమచింత నొంది విరహాబ్ధి మునింగి మనోజబాణవే।

దనకు సహింపలేక పరితాపముజెంది తలంచె నీగతిన్॥ ఉ॥ భ
క్తరక్షణంబు సన్విడచియుండని మత్ప్రియు డేలరాడు తా। నె
క్కడ కేగియుండెను సహింపగజాల వియోగమింక నే। దిక్కు
న కేగుదున్ బతిని దెచ్చెదువా రెవరింక నేవిధిన్। జిక్కు విభుం
డు నాకనుచు జిత్తము నుత్తలపాటు జెందగన్॥ వ॥ అప్పు డ
ప్పుడమిదాల్పుచూలు ముప్పిరిగొను తాపంబున గార్తికేయ
వీరభద్ర చండీశ్వర భృంగీశ్వర నందికేశ్వర కాలభైరవ దం
డపాణి ప్రముఖ ప్రమథగణంబుల నెల్ల నెల్లదిక్కులకుం బుత్తెంచి
న వా రతిరయంబునన్ జని భూలోకం బాలోకించి భువర్లోకం
బరసి స్వర్లోకంబు నిరీక్షించి మహర్లోకంబు వెదకి జనలోకంబు
శోధించి తపోలోకంబు నిరీక్షించి సత్యలోకంబు నెమకి యత
లంబుగాంచి వితలంబురోసి సుతలంబుజూచి తలాతలంబు దిరిగి
రసాతలంబు గనుంగొని మహాతలంబు విమర్శించి పాతాళంబు బ
రిశీలించి చక్రవాళంబు జుట్టుముట్టి నదీనదగిరికూటతరుకోటర
వనవిటప ముఖనిఖిల స్థలంబులు గ్రుమ్మరి యిందుకళాధరు నెం
దుంగానక వేసరి తిరిగివచ్చి మృడుం డగపడడని విన్నవింప నప
ర్ణ విన్ననగుచు తన దివ్యదృష్టింజూచి నిజేశుండు గజాసురహృ
దయ సరోజంబునం దుండు టెఱింగి తన్నగజ ఖిన్నత్వంబున వె
న్నుం బ్రార్థింప నాక్షణంబున రాక్షసాంతకుండు దాక్షాయణికి
సాక్షాత్కరించిన రమేశ్వరున కా పరమేశ్వరి యిట్లనియె॥ సీ॥ క
మలాక్ష వినుము నా కాంతుడిప్పుడు గజాసురగర్భగోళమందిర
మునందు। జిక్కియున్నాడు నే నెక్కరణి వియోగసాగరం బీదు
దు జలజనాభ। భస్మాసురునకు నభస్మారమునదొల్లి బహుదుర్ఘ
టంబైన వరమొసంగి। దనుజు డంతట దన్ను వెనుకొన్న భీతిచే

బరువులిడంగ నీ వరుగుదెంచి॥ గీ॥ విమలబుద్ధి నుపాయాంతర
మునవాని। శమనువీటికి బుచ్చి నా రమణునపుడు। గాచి రక్షించి
నాడవు గావె నీవు। సాధుజనపోష హతదోష సత్యభాష॥ ౩౦॥
క॥ ఆకరణి నిపుడు మత్పతి। శ్రీకరముగ దోడి తెచ్చి శీఘ్రతరము
గా। నాకండ్ల బెట్టవేయని। ప్రాకటముగ శైలతనయ ప్రార్థన సే
యన్॥ క॥ అంబికనుగాంచి యపుడ। య్యంబుజనాభుండు నిట్టు
లనె నిముసములో। నంబర కేశుని దెత్తు మ। నంబునజింతింపక
మ్మ నగరాజసుతా॥ క॥ ఉమ నీగతి నాలక్ష్మి। రమణుండోదా
ర్చి తా బిరానంజని వా। గ్రమణీనాథ శచీన। ప్రముఖులరావించి
తగనుపాయం బొప్పన్॥ సీ॥ హరితనదక్షిణహస్తంబునందు బా
కాబూని పిల్ల జేగంట వామ। కరమునందు ధరించి శిరమందు ధ
క్కిణీ పాగా వెలయజుట్టి ఫాలమందు। జెలువొప్పతిరుమణి శ్రీచూ
ర్ణ రేఖలు మెరయగణాంబుల మేలు బంగ। రంపు పోగులమర్చి
సొంపుగా నొకనిల్వుటంగిని దొడిగి హారంగునలువ॥ గీ॥ వల్లె
వాటున వైవ నాననజభవుడు। ఓలుపీరణమిందుంపు దాళమూ
కు। భేరుడు ధరించె సన్నాయి నారదుండు। బూనెసంతట శ్రుతి
నితుంబురుడు దాల్చె॥ క॥ నందినివస్త్రాదులచే। బొందుగముస్తా
బు జేసి భూజనులకు నా। నంద ముదయింప నయ్యర। విందాక్షు
డు గంగిరెద్ద వేషము దాల్చెన్॥ ౩౨॥ సీ॥ రివ్వురివ్వున భజంత్రీ
లు మోగించుచు బాకాలొదల్ మహాభీకరముగ। సేయుచు
బెద్దసన్నాయి బాడుచు పిల్లజేగంటగొట్టుచు శీఘ్రగతిని। ప్ర
జలద్భుతంబొంద గజదానవుండేలు పట్టణంబునుజొచ్చి బహువి
ధముల। నందిని పురవీథులందు నాడించుచు దనుజేశునాస్థాన
మునకు జేరి॥ గీ॥ చెన్నుమీరంగ నందిచే జిత్రగతుల। గొంత

ప్రా ద్దాటలాడించి వింతపనులు। సభ్యులెల్లనుమిగుల నాశ్చర్య
మొందె। నింపుగానందిచేత జేయించిరిట్లు॥ సీ॥ అక్కజంబొప్ప
గానొక్క కాలు ముడిచి ముక్కాళ్ల నడిపించి రొక్కమారు। పా
దద్వయంబెత్తి పాదద్వయము భూమి నూనక నడిపించి రొక్క
మారు। రక్కసికేసికి మ్రొక్కుమంచును జెప్పి తక్కక మ్రొ
క్కించి రొక్కమారు। అడిగినమాటల కౌనుకాదని శిరంబూచు
నట్టుగ జేసి రొక్కమారు॥ గీ॥ నురికిలంఘింపగా జేసి రొక్కమా
రు। చూపుమన్నట్టివారల జూపునట్లు। బొడువుమన్నట్టివారల
బొడుచునట్లు। చేసెరొక్కమారు జనులుసెబాసనంగ॥ ఉ॥ అంత
టదానవాధిపు డహోభళిరేయని మెచ్చి చిత్తమం। దెంతయుసం
తసించి భువినిట్టివిచిత్రము గానమంచు న। త్యంతకృపారసార్ద్ర
హృదయాంబుజుడై కపటంబటంచు ర। వ్వంత నెరుంగలేక నత
డాహరి ముఖ్యులగాంచి యిట్లనున్॥ గీ॥ మెచ్చితినికోరి కొండి
క మీయభీష్ట। మిచ్చెదననంగ నప్పుడయ్యింది రేశు। డెలమినం
దినిగాంచి తా నిట్లుబల్కె। దెల్పునీకోర్కె దానవాధీశునకును॥
చ॥ అనియెరిగింప నందియు మహాముదమూర సురారిచెంతకున్।
జని తనశీర్షమాతని లసద్వపులోదరపీఠి నంట జే। ర్చిన నపుడా
సురారికులశేఖరు డంబుజనాభముఖ్యులన్। గనుగొని దీనిభావ
మెరుగంగ వచింపుడు తప్పకిచ్చెదన్॥ ౮౦॥ క॥ ఆదనుజాధిపు
డిట్లన। గా దనుజారాతివల్కె గడుమోదముతో। నో దానవే
శ్వర త్వదీ। యోదరగతుడైన శంభు నొగినర్థించెన్॥ ఆ॥ వె॥ అ
న్నమాట దప్పనట్టి దాతవుగాన। నీమహోక్షరాజ మిపుడు గో
రి। నట్టి కోర్కె దీర్పుమనగ నద్దానవవ। ల్లభుండు మిగుల దల్లడి
ల్లి॥ ఉ॥ ఎక్కడగంగిరెద్దిదియు నిప్పుడి కేటికి దెచ్చిరీక్రియన్। ద

క్కకఁ దెచ్చిరా పురమునంగల యిండ్లకుఁబోక మున్నగా। నిక్క
డికేల వచ్చిరి రహింమరి వచ్చిరిబో వృషంబు బె। న్వెక్కసమైన
కార్యము లనేకము లిక్కడ సెయనేటికిన్॥ గీ॥ చేసినను జేసెబో
నాకుజిత్తమందు। పన్నగామోదమేల నుత్పన్నమయ్యె। నయ్యె
బోమానసంబున కపుడుతోఁచి। నట్లాసంగక వాంఛితమడుగ నేల॥
క॥ అశిగితిబో నేనస్తున్ప్ర। నడుగక శివునిమ్మటంచు నడుగగ నేలా।
కడుమోసమయ్యె నిది యె। క్కడికోరిక నిట్టివింత గలదే ధా
త్రిన్॥ ౭౨॥ గీ॥ మదిని యోచింపగా నిది మాధవుండు। కృత్రి
మంబునబన్నినకృత్యమట్లు। దోఁచె హరి దానవులకు శత్రుండుగా
న। నెట్టులైనను నను జలపట్టి చంపు॥ సీ॥ అన్నరీతిగనియ్యకున్న వి
ష్ణుడు నన్నుమిన్నక విడువ డింకెన్నిగతుల। నైనమాయలబన్ని
హానిసేయకపోడు మిగిలినపనికింక వగువనేల। ననిశివు దనమాన
సాబ్జమందుననిల్పి నిశ్చలచిత్తుడై నియతితోడ। బ్రార్థించెనిటు
లనోపరమేశనాకింక మరణంబుదప్పదీ హరికతమున॥ గీ॥ భూ
మిలో నాశిరంబును పూజనొందు। నట్లుగా జేసి నాచర్మమునవర
తము। నీవు దాల్పుము కృపతోడ నీలకంఠ। మంగళాకర శివ స
ర్వమంగళేశ॥ వ॥ అని యివ్విధంబున గజదానవుండు భుజంగ
భూషణు దనహృదయాంబుజంబున ధ్యానింపుచు దన్మయత్వం
బున ముకుళీకృతలోచనుండగుచు నూరకున్న నదియే యనువు
తిగా దలంచి మందరధరుం డానందికిన్ సైగ జేసి పురికొల్పిన॥
ఉ॥ చెంగునదాటి నంది మదసింహ మభంగనఖాళిచేత మాతంగ
శిరంబుజీల్చిన విధమ్మున గొమ్మునజీల్చివై చె మా। తంగనిశాచ
రోదరము దత్క్షణమా దనుజుండు దెళ్లిగా। నంగజవైరివాని జఠ
రాంతర మొయ్యనబాసి వెల్వడెన్॥ క॥ ఈగతిశంభుడు వెల్వడ।

గా గోవిందుండు మోదకలితుండగుచున్। కౌగిటనిడికొని మది
నను। రాగంబున ననిరె నాపురద్వేషునితోఁ॥ ౫౦॥ క॥ పర
మేశ్వర ఖలులకు దుష్కరమైనవరంబులియ్యఁగా జనునె వసుం।
ధర దుష్టోరగములకున్। వెరవొప్పగ బాలుబోసి పెంచినభంగిన్॥
క॥ ఇటమీఁద నెన్నఁడీగతి। దటుకున దుర్మార్గులైన దనుజులకు మ
హోత్కటవరములు కృపచే నొస। గుటమానగవలయునుమ్ము
గోరాజహయా॥ క॥ అనిచెప్పిన వనజాక్షుని। గనిసంతసమొప్ప
నంబికాధవుడు మహా। వినయతనీగతి సన్నుతు। లొనరించె విరిం
చిముఖ్యులొగి మోదింపన్॥ శా॥ ఆపద్బాంధవ నైనతేయహ
య మాయాతీత విశ్వంభరా। పాపారణ్యదవానలా శుభకలాపా
సర్వదుష్టాసురా। టోపాంభోదసమీరణా౽వ్యయ విరాడ్రూపా
ముకుందాచ్యుతా। శ్రీపా భక్తజనాంతరంగనిలయా శ్రీరంగ
నాథాహరీ॥ ఉ॥ సాగరకన్యకానయనచారుచకోరసుధాకరా
మహా। యోగిసమాజమానసపయోరుహమత్తమధువ్రతా ప
య। స్సాగరవాస విశ్వమయ సారసపత్రనిభాక్ష లోకర। క్షా గ
రుడధ్వజా లలితకాంచనవాస విపజ్జనావనా॥ ౫౧॥ సీ॥ విశ్వంభ
రుండవు విశ్వమయుండవు విశ్వకారణుడవు శాశ్వతుండవు। ని
ష్కళంకుండవు నిర్వికారుండవు నిర్వికల్పుండవు నిర్గుణుడవు। స
గుణుండవు సమస్తజగదవనుండవు నిగమాంతవేదివి నిస్తులుండ
వు। శ్రీసహితుండవు। శ్రీనివాసుండవు శ్రీమనోహరుడవు శ్రీ[illegible]
డవు॥ గీ॥ సులభుడవు దుర్లభుండవు సుస్థిరుడవు। స్థూలుడవు
సూక్ష్ముడవు పరిశుద్ధమతివి। వశ్యుడ వవశ్యుడవు మునివంది
తుడవు। దివ్యుడవు భవ్యచరితుడ వవ్యయుడవు॥ వ॥ అని యనే
కగతుల నుతులొనరించిన గంతుగురుం డెంతయు సంతసించి పం

చశరారాతివలన వీఁకుకోలుపడసి చతుర్ముఖశతముఖప్రముఖ నిఖి
లబర్హిర్ముఖ పరివేష్టితుండై నిజనివాసంబున కరిగె నంత నంత
కాంతకుండు భక్తానురాగుండు గావున గజాసురాభీష్టంబు నెర
వేర్పందలంచి వానిచర్మం బర్మిలి నంబరంబుగా ధరించి వానిశి
రంబు గుహారంబునందునుమ నాకశాత్రప్రహతి నొక్కదంతంబు
దునిసి యేకదంతంబుతోనున్న హస్తిదనుజమస్తకంబు హస్తం
బునంబూని నంది నధిష్ఠించి కైలాసంబున కేతెంచుసమయంబు
న మున్నుగ గిన్నరు లరిగి తదీయవృత్తాంతంబంతయు భవాని
కెరిగించిన నపరిమిత కుతూహలాయత్తచిత్తయగుచు దక్షణం
బ॥ సీ॥ అభ్యంగనస్నాన మాచరింపదలంచి కలవాణిమొదలై
న చెలులతోడ। జెప్పగా సంతోషమొప్ప నప్పడతు లంబిక నె
క్క నవరత్నపీఠమందు। నాసీనగా జేసి వాసనగలనూనెతోడ శి
రంబంటి వేడుకలర । పుష్పొడి జాఫరాపొడి పచ్చకప్రంబు గలిపి
దేహమునకు నలుగిడంగ॥ గీ॥ నా నలుగుబిండి తాలికలగుచు
గ్రింద। గోలగాగొన్ని మరికొన్ని గుండ్రముగను। వడుట గను
గొని శర్వాణి కడుముదమున। దలచె నీరీతి నప్పుడు తనమనము
న॥ చ॥ కరములరీతి గొన్నియును కంఠమురీతిగ నింక గొన్ని
యున్। జరణములట్లగొన్నియును జానువులట్లగ గొన్ని జంఘలు।
ట్లరుదుగ గొన్ని పెందొడల యందమునన్ మరికొన్ని వటుప్రవా।
పిరుదులభంగి కొన్ని గనుపించెనటంచు దలంచి వేడుకన్॥ గీ॥ లీ
ల న త్తాలికలనెల్ల శైలతనయ। జేర్చి యొకవిగ్రహంబుగా జేసి
రత్న। సంయుతస్వర్ణ దివ్య భూషణము లునిచి। పీఠమందున గూ
ర్చుండబెట్టి వేడ్క॥ ౬౦॥ క॥ గట్టిదారపట్టి విగ్రహ। మట్టె క
నుంగొనగ మదికి ననురాగంబుల్। బుట్టి మహోత్సాహంబు

న। నెట్టన దలపోసె నిట్లు నెమ్మదిలోనన్॥ క॥ వీనికి జీవముగల్గి
న। మానుగ శశిధరునితో సమానుండగునం। చా నగతనూజ
పంకజ। యోనిన్ దనమది దలంచె నుత్సాహమునన్॥ క॥ తల
చిన తత్క్షణమందున। జలజాసను డేగుదెంచి శర్వాణికి న। త్యల
ఘుతరభక్తి మ్రొక్కన। నలువన్ గని పలికె నిట్లు నగతనయ వె
సన్॥ సీ॥ చతురాస్య వినుము నే నతికుతూహలమొప్ప నభ్యం
గనస్నాన మాచరింప। దలచి దేహమునకు నలుగుబెట్టుకొనంగ
నలుగుబెట్టినపిండి పొలుపుమీర। తాలికలై నా పదంబుల బడ
గ నే నా తాలికలనెల్ల బ్రీతితోడ। నొకవిగ్రహంబుగా నొనరిం
చితిని జూడు మీ విగ్రహమునకు జీవమున్న॥ గీ॥ బాగుగా నుం
డుననుచు నా భావమందు। దోచి రప్పించితిని నిన్ను దోయజ
భవ। గాన జీవం బొసంగవే వీనికనగ। సంతసంబొప్ప నంత నా
జలజభవుడు॥ క॥ ఆ విగ్రహమున కప్పుడు। జీవన మొసగంగ న
తివిచిత్రముగా న। ద్దేవికి బాలుడు వలగొని। వావిరి వందన
మొనర్చి వారని భక్తిన్॥ ఉ॥ క॥ మ్రొక్కిన సుతుగని పా
ర్వతి। గ్రక్కున నాలింగనంబు గావించి వెసన్। జెక్కిలి ముద్ది
డి తొడపై। దక్కగ నిడికొనియె నతిముదంబలరారన్॥ ఆ॥వె॥
అంత నలువ మిగుల సంతసంబున శైల। తనయవలన సెలవుగొని
బిరాన। సత్యలోకమునకు జనియె నంతట గట్టు। పట్టి మదిని
మోద ముట్టిపడగ॥ క॥ బాలకుని చేతికప్పుడు। శూలం బొకటి
చ్చి శైలసుత యి ట్లనె నో। బాలక మగవారెవ్వరి।నీ లోపలికిన్
జొరంగనియ్యక నెలమిన్॥ క॥ వారక నీ విపుడు బహి। ర్ద్వా
రముకడ నిల్వుమనుచు దగజెప్పి ముదం। బారగ మజ్జనశాలకు।
జేరెన్ జలకంబులాడ శివు నిల్లాలున్॥ సీ॥ తల్లి చెప్పినరీతి దడ

యక బాలు డుల్లాసంబుమీఱ శూలంబు దాల్చి। తన్నికేతన బ
హిర్ద్వారసుందమున నిల్చి యుండంగ గంగాధరుండు వచ్చి। భవనం
బు జొఱఁబోవ బాలకు డడ్డమై కనుగవయం దగ్నికణము లొ
లుక। గర్జించి పల్కె నెక్కడ కేగెదవు నిల్వు మభ్యంతరాగార
మందుజొఱఁగ॥ గీ॥ సాహసించెదవౌర యాశ్చర్యమొప్ప। నెవ్వడ
వునీవు వచ్చిన హేతువేమి। చక్కగా నిల్చి తెల్పుము సక్కము
గను। దుడుకుతనమున బోయిన విడువనిపుడు॥ ౨౦॥ క॥ అని ప
ల్కి నట్టి బాలుని। గని శివుడాశ్చర్యహృదయకమలుం డగుచున్।
మనమలర వానితో ని। ట్లనియె ముఖమందు మందహాసము
దోప౯॥ క॥ బాలక నీ వెవ్వండవు। వ్రేలంతయు లేవు నన్ను
వెరపించెద వీ। శూలం బెక్కడదొరకెను। లే లెమ్మడ్డెదవు భీతి
లేశము లేక౯॥ క॥ ఇక్కడ ని న్నెవరుంచిరి। తక్కక నన్నడ్డ నీ
కు దరమగునే పో। మ్మెక్కువ పేలిన నసువులు। దక్కవు సుమ్మా
బిరాన దారిని లెమ్మా॥ గీ॥ వెఱ్ఱివాడవు నీకు వివేకమేమి। తెలి
యకున్నది పో పొమ్ము తెగువతోడ। మాటలాడెదవౌర నీ సా
టి పిల్ల। వాండ్లతో నాడబొమ్మ చావంగ నేల॥ క॥ అనవిన బా
లుని కప్పుడు। ఘనమగు కోపంబుదోడమి కన్గవయందున్। బెను
నిప్పుక లుప్పతిలె౯। మనసిజవైరి గని యాక్రమంబున బలి
కె౯॥ ౨౧॥ ఆ॥ వె॥ బట్ట గట్టుకొనక బుట్టెడు బూడిద। దిట్టముగ
నలంది ముట్టగూడ। నట్టి పునుక పేర్లు సెట్టనదాల్చితి। విట్టి వెఱ్ఱి
వార లెందుగలరె॥ క॥ నాకు వివేకము లేదని। ప్రాకటముగ బ
ల్కె దీవు వరగృహమునకున్। చేకువజొచ్చెదు నీకు వి। వేకంబున్న
దె తలంప వినుము వచింతున్॥ క॥ పల్లదపు మాటలాడుట। వ
ల్ల భయంపడను నీవు వచ్చినత్రోవన్। మెల్లనసరుగుము లేదా।

యుల్లాసంబున్న రమ్మ యుద్ధంబునకున్॥ మ॥ అని బాలుండు వ
చింప శంభుడు మహాహంకారుడై వాని కి। ట్లనియెన్ కుఱ్ఱడవం
చు నోర్చినను కూయుంజొచ్చెదా చూడు మిం। కను నా శక్తి య
టంచు రౌద్రరసమున్ గన్పట్ట శూలంబుచే। దునిమెన్ వానిశి
రంబు వార్ధిఁబడగా దోస్సార మేపారగన్॥ క॥ ఈలీల బాలుశిర
మున్। శూలముచే ద్రుంచి శివుఁడు చొచ్చె గృహమునం। దాలో
శైలాధిపసుత । లీల గృతస్నాతయై లలితభూషణముల్॥ ౮౦॥
గీ॥ వరుసగ ధరియించి హారంబుటావలువగట్టి। శ్రీకరంబొప్పగా
బట్టు రైకదొడిగి। పచ్చికస్తురితిలకంబు ఫాలమందు। దిద్దికన్నుల
కాటుకదీర్చివేగ॥ క॥ ముదమొదవగ మదనారికి । నెదురుగజని
కౌగిలించి హితమతితోడన్ । సదనాంతరమున కాశశి । వదనవె
సన్ దోడితెచ్చె వారనిపేర్మిన్॥ వ॥ ఇట్లాభవాని భవనాంత
రంబున కభవున్ దోడ్తెచ్చి మోదంబున బాదంబులు గడిగి సు
ఖాసీనుం జేసి కుశలం బడిగి ప్రసంగవశంబున సర్వేశ్వరున కాశర్వా
ణియిట్లనియె॥ క॥ దేవబహిర్ద్వారముకడ। వావిరి నేనొక్క చిన్న
వానిన్ బ్రీతిన్। గావలిగనుంచితిని మీ। రేవిధమున మందిరమున
కేతెంచితిరో॥ క॥ ఆచిన్నవానిమీరున్। జూచితిరే మిమ్మునెటు
ల జొరనిచ్చె గృహం। బో చంద్రమౌళి యనగా । నాచంద్రానన
కు నిట్టులనియె శివుండున్॥ ౮౧॥ ఉ॥ సారసనేత్ర నేనిటకు జయ్యె
నవచ్చుచునుండ నీగృహ। ద్వారమునందు బాలుడగు వామను
డొక్కరు డడ్డగించి పె । న్వీరత నన్ను మార్కొని వివేకము లేశ
ములేక గండ్ల నం। గారము లుప్పతిల్ల దనుకంబున బ్రల్లదముల్
వచించినన్॥ క॥ కోపముదయించి నేనా। పాపనిమస్తకము వార్ధి
బడ శూలముచే। నేపుగ దునిమితిననగా। నాపార్వతి దుఃఖితాత్మయై

విలపింపన్॥ క॥హరుఁడడిగని చిత్తమునం। దరు దండిభయంబుగ దురనార్త్యంగనిరెూ। తరళాయతాక్షి నీవి। ట్లురుశోకము జెంద నేల నొయ్యన జెపుమా॥ గీ॥ పంకజాయతనేత్ర యాబాలుడెవ్వ। డింతగా నీవుశోకింపహేతువేమి। తేటతెల్లంబుగా నాకుదెల్పుమనగ। బాహ్మణనాథునితోడ శర్వాణివల్కె॥ సీ॥ నాథనాయొడలకు నలుగుబెట్టినపిష్ట మదనిపై దాలిక లగుచుబడగ। నాతాలికలనెల్ల బ్రీతితో నొక విగ్రహం బొనరించి నేనజునివలన । బాణమిప్పించి యాబాలునిచేతికి శూలమొక్కటినిచ్చి సొంపుమీర।పురుషులెవ్వా రంతిపురి జొరకుండంగ నారయుమని బహిద్వార మందు॥ గీ॥ గాపుగానుంచి నేజలకంబులాడ । వచ్చియుండంగ నింతలో వచ్చిమీరు। బాలుడెరుగక బల్కినపల్కులకును। కన లిచంపుటకెట్లు మీకరములాడె॥ ౯౦॥ గీ॥ అవనిపిచ్చుకపైని బ్రహ్మాస్త్రమేయు। పగిది మీరాగ్ర మాపసిబాలునిపయి। జూపినా రింక నేనెందు జొచ్చుదాన। బాలుగోల్పడి నేనింక బ్రతుకగలనె॥ వ॥ అని యిక్కరణి బెక్కువిధంబున నక్కమలాక్షి పొక్కుచు వెక్కివెక్కేడ్చి కొంతవడి కాశోకంబహంకారంబుగామారి యాగిరికుమారీమణి తనముఖారవిందంబు మధ్యందినప్రాప్త మార్తాండబింబంబు ననుకరింప నిజేశునితో నిట్లనియె॥ క॥ మృత్యుంజయ నీసుతునకు। మృత్యువ్వుగల్గుటదలంప మేదినిలోనన్। వ్యత్యస్తముగద నేనా। మృత్యువు నరనిముసమునకు మృతినొందింతున్॥ క॥ ఇచ్చిరుతనికల్పాయువు। నిచ్చినపరమేష్ఠికిప్పు డిచ్చెదశాపం। బచ్చెనటి దండధరునిన్। జెచ్చెరభస్మంబుగాగ జేసెద గనుమా॥ మ॥ అనిరోషానల సంయుతాక్షియగు నయ్యార్యామహాదేవినిన్। గని శంభుండు దలంకె సాగరసుతాకాంతుం

డెదన్ జంకె వా। గ్వని తాభర్త నడంకె నద్భుతముగా వారాసు తే
డించె న। వ్వసజాపుం డపరాబ్ధిగ్రుంకె నమరవ్రాతంబు భీతిల్ల
గాన్॥ ౯౫॥ వ॥ అప్పుడంభోజభవాంభోజాక్షజంభారిప్రము
ఖు లత్యంతభయాక్రాంత స్వాంతులగుచు కైలాసంబున కేతెం
చి చండతరక్రోధతామ్రాక్షియగు చండికన్ దర్శించి తదీయచ
రణ సరోజంబులకుం బ్రణమిల్లి పంకజాసనుం డాశాంకరి నిట్లని వి
నుతించె॥ దండకము॥ శ్రీమన్మహాదేవరాణీ సరోజాతపాణీ లస
న్నీలవేణీ పృథుశ్రోణి లోకేశ్వరీ లోకమాతా తుషారాద్రిజాతా
గుణోపేత విశ్వేశ్వరీ శాశ్వతైశ్వర్యదాత్రీ కృపాపాత్రి శర్వా
ణి దాక్షాయణీ భద్రకాళీ సితానాథచూళీ పరంజ్యోతి రాజా
ననా రాజరాజేశ్వరీ నిన్ను వర్ణింప నాకుం దరంబౌనె తల్లీ జగజ్జా
లముత్పత్తి గావింపగా బెంపగా ద్రుంపగా శక్తి వీవే గదా నీవు
కోపించి కన్నెఱ్ఱ గావించినన్ నిల్వ నెవ్వారికిన్ శక్యమే తావకా
జ్ఞానుసారంబుగా నెట్టి కార్యంబునుం జక్కఁ జేయంగ బద్ధుండనై
నేను సిద్ధంబుగానుండ లోకత్రయోపద్రవంబిట్లు గావింపగానే
లనో యమ్మ నీవిప్పు డీయుగ్రభావంబు జాలించి శాంతంబు గైకొ
మ్మ కాత్యాయనీ దేవి తుభ్యం నమస్తే నమస్తే నమః॥ మ॥ పురు
హూతుం డగజాసమీపమున మోడ్పుంగేలుతో నిల్చి సు। స్థిర
భక్తిన్ వినుతించె నిట్లు జనయిత్రీ సర్వలోకేశ్వరీ। హరిణాక్షీ హ
రిణాంకసన్నిభముఖీ హర్యక్షమధ్యా మహీ। ధరరాజాత్మజ లోక
ములన్ నిలుపవే దాక్షాయణీ మ్రొక్కెదన్॥ క॥ అనియివ్విధ
మున జతురా। నన ముఖ్యులు వేడికొనగ నగతనయ విరిం। చినిగ
ని యిట్లనియెను నా। తనయుని బ్రతికింపుమీ ముదంబలరారన్॥
గీ॥ అనుచు గ్వాణీశ పలుకంగ సబ్జభవుఁడు। వీని శిరమున్న మరలజీ

వితుని జేతు । ననగనభవుండువలెఁ నయ్యాజునితోడ । సరవిగజ
దానవుని యభీష్టంబు దలచి॥ ౧౦౦॥ ......................
క॥ బడబాగ్నియందుబడె నీ । దుడుతనిశిర మింకసర్వభువనంబు
లలో । బడయుట దుర్లభమగు ని । ప్పుడు దీని కుపాయమొ
కటి పోలగదోచెన్॥ క॥ మానుగనున్నది నాకడ । నేనుగశిర
మొకటిదాని నీబాలునకున్ । బూనిక సమకూర్చి వెసన్ । పీ
నిన్ బ్రతికింపుడనగ విధి ముదమలరన్॥ క॥ తడయక మృడా
నియనుమతి। వడసి గజాసురుని శిరము వల నొప్పగ నా। బుడు
తని కళేబరమునకు। గడుమోదముతోడ నదికికమలజుడంతన్॥
గీ॥ జీవితుని జేసి భువిజిరంజీవిగాగ। ఫాలమందున వ్రాసి యా
బాలునకును। ప్రీతి మౌంజియు యజ్ఞోపవీత మొక్క। ఛత్రము
గమండలంబు నొసంగెనంత॥ మ॥ అపుడాబాలకు డాభవానికి
మనంబారంగ వే మ్రొక్కినన్ । విపులానందయుతాంతరంగ
యగుచున్ వేమారు దీవించి యా। త్రిపురద్వేషినిజూపి నీజన
కు డీదేవుండుగానన్ దదీ । య పదాబ్జంబులకున్ నమస్కృతు
లు నెయ్యంబొప్ప గావింపుమా॥ ౧౦౪॥ క॥ అనవినిగజముఖు
డప్పుడు మినుసికదేవరకు భక్తిమీరగ సాష్టాం । గ నమస్కృ
తు లొనరింపగ । ననురాగముతో నొనర్చె నాలింగనమున్॥
సీసమాలిక॥ అపుడు భవాని బ్రహ్మాదుల గన్గొని పరమమోదం
బుతోబలెఁ నిట్లు। మీరెల్ల వీనికి గూరిమి నొక్కొక్క వర
ము నొసంగంగవలయు ననగ। బ్రహ్మదేవుడువలెఁ బరగ నీబా
లుండు బ్రహ్మకల్పాంతంబు బ్రతుకుననుచు । విధిరాణి వలెఁ
నేవిద్యలకెల్లను మూలంబుగాన నీబాలకుండు । గరమొప్పవి
ద్యలగురువగునని పలెఁ హరి వలెఁ గణపతియగు నటంచు ।

సిరివల్కె- వీనిగొల్చినగార్యసిద్ధియుఘనతరై శ్వర్యముల్ గల్గున
సుచు । విబుధేంద్రుఁ డిచ్చెను విఘ్నాధిపత్యంబు వీతిహోత్రుం
డిచ్చె విపులశుచియు । దండధరుండిచ్చె ధర్మసమృద్ధియు సురవి
రోధియొసంగెశూల మొకటి। పశ్చిమాధిపు డొక్క-పాశంబొసం
గెను పవమాను డతులితజవమొసంగె। నితనిగొల్చిన వారి కతు
లితధన మబ్బు వారక ననుచు గుబేరు డనియె। నీశాను డైశ్వ
ర్యమిచ్చెను భానుండు తేజం బొసంగె రేరాజు తనదు। కళయొ
సంగెను తక్క-గల దేవతాతతి వారిశక్తి కొలందివరము లొస
గి । రిశ్వరుండపుడానతిచ్చెను వీడగ్రపూజితుండగునని భూరిక
రుణ। గడువడి భృంగి శృంగారంబుగావించి మూషకంబును దె
చ్చిముందునిల్పె। నమ్మతి నిది వాహనమ్ముగా గొమ్మని ప్రార్థిం
చె నప్పుడు పరమభక్తి । నిది సర్వమును భాద్రపదశుద్ధపుఁజవి
తి జరిగినకతన నీజగమునందు॥ గీ॥ నమ్మహోత్తమ దినమందు
నఖిలజనులు । వేడ్క-తో బూజ జేతురు విఘ్నపతిని । నిఖిలశు
భకార్యముల గజముఖుని జనులు । ముందుబూజింపుడని సాం
బమూర్తి పల్కె-॥ క॥ ఈరీతినెల్లవరములు । గారవమున నొస
గి దేవగణమును లక్ష్మీ! నారాయణులును మౌనులు। గౌరీశంక
రులు। యాజ్ఞ గైకొని వేడ్క-న్॥ క॥ తనుతమ నివాసములకున్।
గ్రమమొప్పగ నేగి రంత గౌరియు గడు । మోదమునన్ ద
నసుతు ముద్దిడి । విమలమణివిభూషణములు విరివిగ నొసగె॥
క॥ అనిసూతుం డెరిగించిన। వినిమునులానంద మొంది వినయం
బున ని। ట్లనిరి తపోధన పిమ్మట। నెనయగ మరి యేమిజరిగె నె
రిగింపుదయన్॥౧౧౦॥ వ॥ అనుటయు॥ క॥ సౌమిత్రిప్రాణావ
న । చామీకరసన్నిభాంగ శత్రుంజయ । సీతామహిళాదుః

ఖాపహా। రామాంఘ్రిసరోజభృంగ రవిశతతేజా ॥ తోటక వృత్తము॥ పవమానతనూభవ భక్తశర। ణ్యా వనాటవరేణ్యా రణప్రియ దా। నవసంచయగర్వవినాశక రా। ఘవనాయకభక్త వికాసముఖా॥ * * * * *

గద్య॥ ఇది శ్రీపరమేశ్వరీ చరణారవింద మరందపానా మందానంద తుందిలేందిందిరాయమాణాంతరంగ శ్రీమత్తోలేటి వంశపయః పారావార రాకాసుధాకర భారద్వాజ సగోత్రపవిత్ర భాగయామాత్యపుత్రి సకలవిద్వజ్జనవిధేయ సీతారామయాభిధేయ విరచిత శ్రీగణనాథాభ్యుదయంబను పుణ్యచరిత్రంబునందు పూర్వభాగము॥

సమాప్తము.





శ్రీ గణేశాయనమః.

శుభమస్తు-అవిఘ్నమస్తు.

# శ్రీ గణనాథాభ్యుదయము.

(ఉత్తరభాగము.)



శ్రీవిజయనగరవాసా। పావనచారిత్ర రామపాదాంబుజసం। సేవాపర పవనాత్మజ। సేవకమానసవిహార శ్రితమందారా॥ వ॥ దేవా అవధరింపుము శౌనకాది మహర్షీశ్వరులకు సూతుండిట్లని చెప్పందొడంగె॥ క॥ మరికొన్ని దివసములకుఁ। బరువడిజనుదెంచె భాద్రపద మాసంబుఁ। ధరణిన్ సమస్తజనములు। గరిముఖునిన్ బూజసేయ గావలెననుచున్॥ సీ॥వసుధ బ్రహ్మక్షత్ర వైశ్య శూద్రాదులు కడుభక్తి దమనిజాగారములను। లలితరసాలపల్లవతోరణములచే గదళికాస్తంభ సంఘంబుచేత। రమణీయ మౌక్తిక రంగవల్లికలచే శృంగార మొనరించి శ్రీయుతముగ। బహువిధ సుమదళఫలచయంబును గూర్చి మో

దకాదికములు మోదమలర॥ గీ॥ పక్వమొనరించి శ్రీవిఘ్నప
ని భక్తి । యుక్త మొప్పంగ బ్రార్థింప నురుతరముగ । భూ
మిలో జనులకెల్ల నబ్బురముగాగ। నందరికి నన్నిరూపులై హ
రునిసుతుడు॥ వ॥ సాక్షాత్కరించిన నఖిలజనంబు లాగజముఖు
ని సభక్తికంబుగ బూజించి మోదకాది భక్ష్యంబులు సమ
ర్పించిన॥౯॥ మ॥ ప్రీతియింటన్ గణనాయకుండు ముదమొప్ప
న్మోదకంబుల్ వెసన్ । మితిమీరంగ భుజించి తృప్తిసనకన్
మేలైన భక్ష్యంబులున్ । గుతుకం బొప్పగ మూట గట్టుకొని
చేకొంచున్ మహోల్లాస సం। యుతుడై త్రేన్చుచు వచ్చెనం
తటను సూర్యుండేగ నస్తాద్రికిన్॥ గీ॥ అపరదిక్కున గెంజా
య లతిశయిల్లె । వృక్షముల జేరి రొదజేసె విహగసమితి । మి
న్కుమిన్కున దారకల్ మింటబొడమె । బాలచంద్రుండు బొ
డసూపె బశ్చిమమున॥ ఉ॥ ఆసమయంబునందున గజాస్యుడు
మోదయుతాత్ముడౌచు నై। లాసము జేరగా జని కళానిధిజూ
టుని శైలజన్ మహో । ల్లాసముతో గనుంగొని యిలాస్థలి
సాగిలిమ్రొక్కబోవ గా। రీసుతుగర్భ మొయ్యన ధరిత్రికి మో
సి కరాబ్జపాదముల్ । పీసము భూమికందకను వెన్నకు ముందు
కు దూగుచుండగాన్॥ క॥ తొగలచెలికాడుగని న। వ్వగ గజ
ముఖు గర్భ మవిసి వసుధ దొరగె విం । తగ మోదకనిచయం
బును । జగమందున రాజదృష్టి సామాన్యంబే॥ వ॥ ఇట్లు గర్భం
బవిసి వివశుండై ధరాతలంబునంబడి మూర్ఛిల్లిన గజాననుం
గాంచి మంచుమలపట్టి సంచలితాత్మయగుచు మనంబున గ్రో
ధశోకంబులు బెనగొన నాక్షణంబున క్షపాకరు వీక్షించి తీక్ష్ణం
బుగ నిట్లనియె॥ ౧౦॥ గీ॥ ఓగురుద్రోహి నీవిపు డాగడము

న। నా కుమారిని గన్గొని నగుటవలన। నవని మూర్ఛిల్లె గాన
నే డాదిగాగ। నిన్ను గాంచినవారికి నిందలొదవు॥ వ॥ అను
చు శపించె నంత నజుడచ్చటికిన్ జనుదెంచి పార్వతి। తనయుని
లేవనెత్తి సముదంబున మోదకసంచయంబు నా। తని పృథుగ
ర్భమం దునిచి తత్క్షణమందున సూచికాది। సాధనముల గుట్టి
గారికి హితంబుగ నప్పుడు మూర్ఛదేర్చినన్॥ గీ॥ లేచి గణప
తి తల్లిని జూచి వంది। నంబొనర్పంగ నాలింగనం బొ। నర్చి తొ
డల నిడికొని చుబుకంబు బుడికి ముద్దు। గొనుచు మిక్కిలి
సంతోషవనధి దేలె॥ క॥ హిమగిరిసుత కోపమునన్। హిమక
రునకు ఘోరశాపమిచ్చుటచే న। క్కమలారిని జూడగ లో।
కమునంగల జనులు భీతిగలవారగుటన్॥ క॥ దివసాంతమైన
దమతమ। భవనకవాటముల నెల్ల బంధించి మరే। వ్యవహారం
బులు జూడక। వివిధప్రతిబంధకముల వేగిరి జనముల్॥ ౧౫॥
గీ॥ పగలు చంద్రుండు తమకంట బడునటంచు। ధారుణీజనులె
ల్లను తలలువంచి। కొనుచు విహరింపుచుండిరి కుధరరాజ।
తనయ యిచ్చిన శాపంబు తప్పదనుచు॥ వ॥ ఇవ్విధంబున సమ
స్తజనంబులకు సంచారనిరోధంబగుటచే నిందు కొండు సాధనం
బు గానక పరితపించుచుండ వసిష్ఠ వామదేవ గౌతమాత్రి క
ణ్వ గార్గేయప్రముఖ మహర్షీశ్వరు లెరింగి తమకును తత్ప్రతి
బంధకంబు గలుగుటం జేసి సత్వరంబున బ్రహ్మలోకంబునకుం
జని చతురాస్యుందర్శించి సాష్టాంగవందనంబు లొనర్చి చం
ద్రునికిన్ గల్గిన భవానీశాపకారణంబున లోకంబునకు సంభ
వించిన ప్రతిబంధం బెరింగింప నన్నలువయు దక్షిణంబున బలు
కులచెలిం గూడి పక్కిదొర నెక్కి కదువడి నిరుగడల జడదా

రులు నడువ వెండికొండకుం జని మంచుమలపట్టింగాంచి విరించి యుంచండిగ్గి నమస్కరించి యిట్లని స్తుతించె॥ మత్తకోకిల॥ చం ద్రికానిభహాస పూర్ణిమచంద్రవక్త్రి సుధాధరీ। చంద్రజూటమ నః ప్రమోదిని చంద్రఖండవిభూషిణీ। చంద్రభూధర కందరాల య చక్రహస్తసహోదరీ। చంద్రసౌరభగాత్రి సత్పథచారిణీ శుభదాయినీ॥ ఉత్సాహవృత్తము॥ తల్లి నీవు చంద్రునకును త గని శాప మిచ్చుటన్। బల్లిదముగ లోకమందు బాధగల్గె జను లకున్। ఫుల్లనీరజాక్షి కరుణబూని శీఘ్రముగను జా। బిల్లి శా పమోక్షణంబు బ్రీతిగా నొనర్పవే॥ గీ॥ ఒకడొనర్చిన తప్పున కుర్వి సకల। జనవిహారనిరోధంబు జనునె సేయ। దల్లి దయ జూచి భూజనతతికి నిపుడు। బాధవారింపవే దయాంభోధి వేగ॥౨౦॥ క॥ అనివేడిన బ్రహ్మాదుల। గని పర్వతరాజసుతకు గారుణ్యమెదర్ । జనియించి పల్కె నీగతి। వనజభవాద్యఖిల మౌనివర్గము వినగాన్॥ సీ॥ అమర నాప ల్కమోఘముగాన మరలింప దరముగాదైన నా వనజవైరి। నిదిమొదలొక్కని భా ద్రపదశుద్ధపుజవితి గనుగొనువారి కక్కజముగాగ। నిర్ని మిత్తంబైన నిందలువాటిల్లునని యానతిచ్చె నయ్యగతనూజ। బ్రహ్మాదులందుకు పరమసంతోషాత్ములగుచు భవానిచే నాజ్ఞ వడసి। తల్లిపోయిరి తమనిజస్థానములకు। ధరణిజనులెల్ల స్వే చ్ఛగా దిరిగిరప్పు। డంతగొన్నిదినంబుల కరుగుదెంచె। వాసి గా భాద్రపదనామమాస మెలమి॥ క॥ నారదు డొకదినమందు న। ద్వారక జని వాసుదేవు దర్శించి ముదం। బారగ ముచ్చట లాడుచు। నారూఢిగ మౌనివరుడు హరికిట్లనియెన్॥ ఆ॥వె॥ ను దనజనక భాద్రపదపు శుద్ధచతుర్థి। యగుటవలన మామకాశ్రి

మంబు। జేరవలయు నిపుడు శీఘ్రింబు సెల విమ్ము। నేడు కుముదహితుని జూడరాదు॥ క॥ అనవిని కలహాశనునిన్ । గనుగొని కృష్ణుడు వచించె గమలారిని జూ । చినదోసమేమియన న । మ్మునివర్యుడు తెల్పె సర్వమును శ్రీహరికిన్॥౨౩॥ క॥ ఈరీతి జెప్పగావిని । నారదమునిగాంచి పల్కెనళినాక్షుం డో। సారతపోధన భువి నె। వ్వారైన జతుర్థియందు వనజవిరోధిన్॥ క॥ కనుగొనకుండుట దుర్లభ । మనఘా కావున ధరిత్రి సల్లెవరైనన్ । గనుగొని నిర్హేతుకనిం । దను బొందినవారు గలరె తాపసవర్యా॥ క॥ అనియడిగిన కృష్ణున కా। మునివరు డిట్లనియె విన యమున జవితిని సో । మునిజూచిన కారణమున । మునిభార్యల కొదవె నింద మున్ను ముంకుందా॥ వ॥ అదెట్లనిన సప్తజిహ్వుండు సప్తర్షి భార్యలం గామించి కామజ్వరపీడితుండై కృశింపంగని తద్ధర్మపత్నియగు స్వాహాదేవి తదభిప్రాయంబెరింగి భర్తంగని భవదభిమతానుసారంబుగ విశ్వప్రయత్నంబు జేసి ఋషిభార్యలం బోధించి దినంబున కొక్క రే తెంచి త్వదీయ మనోభీష్టంబు నెరవేర్చు నటులం జేసెద నని యొడంబరచి తాననుదినంబు నొక్కొక్క ఋషిభార్యరూపంబు ధరింపుచు నరుంధతీరూపంబు నొందజాలక తక్కిన మునియువతులరూపంబులచే భర్తందృప్తిగావించెఁ దదనంతరంబు॥ సీ॥ అనుదినం బీరీతి నగ్నిహోత్రినిభార్య మునిగేహినుల రూపములు ధరించి । పతికడ కేగుచో బరులు గన్గొని మౌనిసతులెల్ల నిజముగా జాతవేదు। బొందుచున్నారని నిందింపసాగిరి తాపసాంగనలు భాద్రపదశుద। పక్షంపు జవితి శశిపాకరు బొడగన్న కారణంబున నిందగలెనిట్లు॥ గీ॥ పరగ భువిలోన శర్వాణిప ల్కమోఘ । మగుటచే

నెంతవారికి నైన గాని । వశమె తప్పించు కొనగ నివ్వసుధయం
దు । రాజగోపాల భక్తసమాజపాల॥౩౦॥..............
ఆ॥ వె॥ఇటుల విన్నవించి యేగె నాజడదారి। యాదవేంద్రుడఖిల
యాదవులకు। దెలియజెప్పెనేడు జలజారిబొడగన । వల్లగాదటం
చు దెల్లముగను॥ వ॥ అంత॥ సీ॥ అతపంబుశమించె నబ్జముల్
ముకుళించె గలువలంతంతకు దెలివిగాంచె । వృక్షాగ్రములయం
దు బక్షులరొదమించె నపరాశ గెంజాయ లతిశయించె । వీథిగు
మ్మములందు వెలయాండ్రు వసియించెసర్వంబులెల్లెడ సంచరిం
చె। గోవులు తమతమ తావులకేతెంచె విటులసంతోషముల్
విస్తరించె॥ గీ॥ ప్రతిగృహంబుల దీపముల్ ప్రజ్వలించె । మల
యపవనుండు వీతెంచె మహి సమస్త । మేదినీసురు లంభోజమి
త్రునకును । నర్ఘ్యమర్పించి రాదిత్యుడస్తమించె॥ గీ॥ పూల
దండలు గొప్పకప్పురపు పేర్లు। పండుటాకులపట్టీలు ఫలచయంబు।
విటులకమ్మిరిపుష్పలావికలు వీట । నపరదిక్కున బాలసుధాంశు
డలరె॥ క॥ ఉడుగణ మంబరమందున । బొడచె నిశారమణి నీలి
పుట్టంబు ముసుం। గిడినట్లు సందెచీకటు। లడరెన్ దశదిశలయం
దు నాసమయమునన్॥ గీ॥ ఇందు డగుపడునని మదిసందియము
న। క్రిందికినిజూచుకొనుచు నాకేశవుండు। పాలుబిదుగుచునుండ
నాపాలలోన। బాలచంద్రుండు ప్రతిఫలింపంగగాంచి॥ ౩౨॥ క॥
యదుకుల జలనిధిచంద్రుం । డెదజల్లుమనంగ నంత నెంతయు
జింతా।స్పదహృదయాబ్జుండగుచును। మదిలోనదలంచె నీక్రమం
బున దుదకున్॥ సీ॥మిగిలినపనికింక వగువనేమిఫలంబు కానున్న
కార్యంబు గాకపోదు। శర్వాణిపల్కిన శాపాక్షరంబులు దప్పిం
పనేరికి దరముగాదు । నిర్నిమిత్తంబైన నింద నాకొదవును కా

నిమ్మ్మద్రై వసంకల్పమెట్టు। లుండునో తెలియ దింకొండుమార్గము దీనికగపడ దైనసీజగతియందు॥ గీ॥ నిందవాటిల్లెనేని నానేర్పుకొలది। బాపికొనియెద ధారుణీప్రజలు వొగడ। ననుచుధైర్యాంతరంగుడై దనుజవైరి। పరగ భోజన మొనరించి పవ్వళించె॥ క॥ జలజములు మేలుకొనియె। గలువలు నిద్రించె బక్షిగణమెల్లెడలన్। గలకలమని రొద జేసెన్। బలబలదెలవారెనంత భానుడు బొడచెన్॥ క॥ ఆలోగ్కృష్ణుడు మేల్కని। కాలోచితకృత్యములను గావించి జగ। జ్జాలావనశీలుండై। కాలముగడుపగ నొకానొక దివసమందున్॥ క॥ సుత్రామోపమభోగుడు। ధాత్రీనాయకులలో బ్రధానుడు హిమవ। ద్ధాత్రీధరనిభధైర్యుడు। సత్రాజిదాఖ్యాధవుండు సమ్మోదమునన్॥ ౮౦॥ సీ॥ భానుప్రసాదలబ్ధంబగు దివ్యశమంతకమణిదాల్చి మాధవుగన। నరుగుదెంచుచునుండ నాశమంతకమణికాంతి గనుంగొని కమలమిత్రు। డవనికిడిగ్గెనోయని పురవాసులు భ్రమనొందిచూడ నప్పార్థివుండు: రయమున హరిమందిరద్వారమును జేరి దౌవారికులచేత శ్రీవిభునకు॥ గీ॥ తానువచ్చినగతి వర్తమానమంపి। మురహరుననుజ్ఞ నాస్థానమునకు జేరి। బాలశశిఫాలు మునిలోలు భర్మచేలు। గాంచె మనమార గన్నుల కరవుదీర॥ వ॥ ఇట్లువచ్చిన సత్రాజిద్ధాత్రీకళత్రుం గని వసుదేవపుత్రుం డతిగౌరవంబున నాహూయంబొనర్చి తనచెంత నహాసనంబునం గూర్చుండ నియమించి కుశలం బడిగి కొంతదడ విష్టగోష్ఠీప్రసంగంబుల సంతుష్టాంతరంగుం గావించి గోపాలకుం డా భూపాలకు నుద్దేశించి యిట్లనియె॥ క॥ ఈ మణిరాజము జూడన। భోమణిగతి వెలిగె నీ త్రిభువనంబులయం। దీమణి కెన గనలేదో। ధీమణి నీకిద్ది నేగతిన్ బ్రాప్తిం

చెన్॥ క॥ అనియడిగిన సత్రాజి। న్మనుజేంద్రుడు మోదమలర మాధవుతో ని। ట్లనియెన్ మార్తాండుని నే। ననవరతము భక్తితోడ నారాధింపన్॥ క॥ సంతుష్టుడగుచు నాకు శ। మంతకమణి యనగ దీని మానితకరుణా। స్వాంతుండగుచు నొసంగె ము। రాంతక మరి దీనిమహిమ నలవియె పొగడన్॥ ౨౪॥ ఆ॥ వె॥ ఏగృహంబునందు నీమణియుండునో। నాగృహాధిపతికి సద్భూతముగ। బ్రతిదినంబునందు బండ్రెండుబారువుల్। కాంచనంబొసంగు గమలనాభ॥ క॥అనిచెప్పిన విని కృష్ణుం। డెనయగ నాశ్చర్యకలిత హృదయాబ్జుండై। ఘనుడగు సత్రాజిత్తున్। గనుగొని తా నిట్లుబల్కె గడుముద మలరన్॥ సీ॥ రాజేంద్ర యీ రత్నరాజమ్ము నాకిమ్ము దీనికి బదులుగా దివ్యరత్న। కోటియు నొకకోటి గోవులనిచ్చెద ననగ సత్రాజిత్తు హరిని గాంచి। పలై నో యదునాథ పదికోట్ల మణులు నాకిచ్చిన నీరత్న మియ్యజాల। నని ధనలోభత్వమున బల్కనైన పోనిమ్మని హరిపల్కె సమ్మదమున॥ గీ॥ పిదప గృష్ణుడు వాని సంప్రీతితోడ। భోజనాదికముల దృప్తి బొందజేసి। వేడుకలరగ గప్పుర విడెమొసంగి। వీడుకొల్పంగ జనియె బృథ్వీవిభుండు॥ వ॥ అంత మరికొన్ని దినంబుల కా సత్రాజిన్మహీవరుని సహోదరుండగు ప్రసేనుం డా శమంతకరత్నం బురుతం ధరించి ఘోటకారూఢుండగుచు వేటతమకంబున ఘోరాటవుల సంచరింప నొక కంఠీరవం బా నృపకంఠీరవుం జంపి తదీయగళంబున న్వెలుంగురత్నం బామిషంబుగా భావించి నోట గరచుకొని జనునెడ బలవంతుండగు జాంబవంతుం డా పంచాస్యంబును పంచత్వంబు నొందించి తద్వక్త్రంబునం బ్రకాశించు రత్నంబుంగొని నిజగుహాంతరంబున కే

తెంచి॥ క॥ ఆరత్నము తనదు క్షమా। రీరత్నము తొల్లియందు
శ్రీకరమొప్పన్। గూరిమిగట్టి మహాముద। మూరగ నిశ్చింతనుం
డె నంతట నచ్చోన్॥ ౫౦॥ వ॥ సత్రాజిస్మహీకళత్రుండు తన
సహోదరుండగు ప్రసేనుం డడవులకుంజని తడయుట కెంత
యుం జింతించి పరిచారకుల నెల్లదిక్కులకుంబుచ్చి వెదకించియు
నించుక నాతనివృత్తాంతంబు వినరామికిన్ మిగుల నుగిలి పలుదె
రంగులం దలపోయుచు బంధుమిత్రాదులతో నిట్లనియె॥ క॥
ము న్నొకనాడా వెన్నుని। సన్నిధికే నేగినట్టి సమయంబున
దా। నన్నడిగె శమంతకమణి। గ్రన్నన నే నీయకున్న గార్పణ్యా
మునన్॥ ఉ॥ ఉన్నటులుండి మామక సహోదరు డిప్పు డ
రణ్యసీమకున్। గ్రన్ననబోయి వేటతమకమ్మున గ్రుమ్మరునట్టి
వేళ బ్రి। చ్ఛన్నత వెంటనంటి యతిసాహసమొప్ప వధింపబోలు
గా। కున్న మహీస్థలిన్ దునుమ నోపుదురే పరవార లాత
నిన్॥ క॥ అని సత్రాజిత్తు విధ। మున నెగులున బల్కు వాక్యము
లు భూలోకం। బున దరుచుగ నల్లుకొనన్। గనకాంబరు డాల
కించె గర్ణాకర్ణిన్॥ ఆ॥ వె॥ ఆలకించికృష్ణు డంతరంగంబున। జా
లచింత నొంది పాలయందు। బాలచంద్రు భాద్రపదశుద్ధపు చతు
ర్థి। గన్నఫలము నేడు గంటిననుచు॥ ౫౫॥ క॥ ఆ లీలామనుజుం
డవు। డీలీలం గొంతదడవు నెదజింతిలి తా। నాలో నతిధీరత ని।
ట్లాలోచన జేసె నిశ్చయాత్ముం డగుచున్॥ ఆ॥ వె॥ దీనినిజము
నేను పూనికతో బయల్। బుచ్చకూరకున్న వచ్చినట్టి। నింద
బోదు నాకు నిశ్చయంబనుచు నా। నందసుతుడు కాననమున
కరిగి॥ సీ॥ వనజనాభుండిట్లు వనమున కేతెంచి శోధింపగా నొక్క
చోటగుట్ట। పడుగులజాడ కన్పడిన నయ్యడుగులు విడువక వాని

వెంబడినిబోగ। నాసమీపమునందు గేసరిచే జంపబడిన గుఱ్ఱం
బును పుడమి రేని। గనుగొనిపిదప సింగముజన్న సరణి నేతేరగా
వే రొకదిక్కునందు॥ గీ॥ మృతిని బొందిన యా మృగపతికళే
బ। రమును భల్లూకపాదచిహ్నములు గాంచి। మరియు నాజాడ
జనె నొక గిరిగుహాంత। రంబు జొచ్చెను కృష్ణు డబ్బింబుగాగ॥
క॥ అడుగులు చడిగాకుండగ। గడునేర్పుగ నడచి రాధికాజారుం
డె। క్కడు ధైర్యచిత్తమున నొ। క్కెడ బొంచి కనుంగొనంగ
నెదురుగ నొకచోన్॥ క॥ బాలికడోలికయందున। వ్రేలుచు దే
దీప్యమగుచు వెల్గెడిరత్నం। బాలోకించుచు మణి దన। కేలును
జాచుచు బిరాన గృష్ణుడు తివిచెన్॥౭౦॥...................
క॥ నిబ్బరముగ హరి మణిగొన। నబ్బాలిక కావుకావు రని బె
ట్టుగ దా। బొబ్బలిడ జాంబవంతుడు। గొబ్బున జనుదెంచికాం
చె గోపాలకునిన్॥ చ॥ కని హరి నంత దస్కరునిగా మదినెంచి
కషాయితాక్షుడై। వనచరనాయకుం డతిజవంబున వచ్చి ము
రారివక్షమం। దున బలుముష్టిచే బొడువ దోయజనాభుడు నొ
చ్చి జాంబవం। తుని శిరమందు గుద్దె బలు దోర్బలమొప్ప న
నూనముష్టిచేన్॥ క॥ ఇరువురుజలమున నీ్రక్రియ। హరిహరియున్
గరియుగరియు నచలం బచలం। బరుదుగ దలపడువడునను। ను
రువడి బోరాడి రేడహోరాత్రంబుల్॥ సీ॥ అంతకంతకు
జాంబవంతునిసత్వంబు క్షీణింపగా దన చిత్తమందు।దలపోసె నీ
రీతి ధారుణినాతోడ బోరి గెల్చినవారు లేరితండు। పురవైరిగా
వలె మురవైరిగావలె గాకున్న నొప్పింపగలరె నన్ను। ఘోర
యుద్ధములందు దేరిననాకు నిర్వీరునితో బోర వింతగాను॥ గీ॥
వీనులందున గాడ్పులు వెడలజొచ్చె। నొడల జెమ్మట లెక్క

బెం పుడిగె ధైర్య। మడఁగె మానసమున భీతి గడలుకొనియె। న ష్టులెల్లను గుండ పిండయ్యె నకట॥ వ॥ ఇట్లా భల్లూకవల్లభుం డుల్లంబునం దల్లడిల్లి వల్లవీపల్లవుని పదపల్లవంబుల కెరగి గద్గదస్వరంబుతో నిట్లనియె॥ ఉ॥ గీ॥ దేవ తావకమహిమ నే దెలియలేక। మిగుల నేరంబొనర్చితి దెగువతోడ। మించుకృపతోడ దప్పుమన్నించి మీర। లెవ్వరో నిక్కముగ నానతియ్యవలయు॥ వ॥ అనిన జాంబవంతున కా జాంబూనదాంబరుం డిట్లనియె॥ క॥ నందునకు యశోదకు నే। నందనుడ బలానుజుండ నను భువి కృష్ణుం। డందురు నా కిపు డొకబలు। నిందవొడమె లోకమందు నిశ్శేతువుగాన్॥ వ॥ అదెట్లంటివేని జెప్పెద నాకర్ణింపు మొక్క దినంబున సత్రాజిత్తు మదీయాంతికంబున కేతెంచి యిష్టగోష్ఠినుండు నెడ దదీయ కంఠపీఠిన్ వెలుంగు సూర్యప్రసాదలబ్ధ శమంతకమణి నే నర్థించిన నందు కాతం డిష్టపడక వెడలిపోయె నంత మరికొంతకాలంబున కాతని సహోదరుఁడగు ప్రసేనుం డా మణి ధరించి వేటకుంబోయి మరల రానందున నే నాతనిం గపటంబునం జంపి తపనదత్తరత్నం బపహరించితి ననియు నిందుకు సందియంబు లేదనియు బంధుబృందంబుతో వాకుచ్చినటుల నాకుం గర్ణగోచరంబగుటచే నిందులనిజం బెవ్విధినైన న్వాలిబుచ్చి నా కొదవిన నింద దొలంగం జేసుకొనువాడనై గిరిగుహారణ్యప్రదేశంబులం జూడఁగట్టుకొని రా నిచ్చోబుణ్యావశంబున దద్రత్నముం గని సాహసంబునం దీసితినని తేటతెల్లంబుగ నెరింగించిన నవ్వనాటకుల శేఖరుం డద్భుతానంద భయంబులు ముప్పిరిగొన దదీయచరణకమలంబులకుం బ్రణమిల్లి మస్తకన్యస్తహస్తాబ్జుండై యిట్లని స్తుతించె॥ లయగ్రాహి॥ శ్రీ

రమణ సన్నుతశివారమణ వందితశచీరమణ భాస్కర నిశారమ
ణనేత్రా।నీరధిగభీర యదువీర నతదుఃఖపరిహార సువిచార మద
వైరికులజైత్రా। వారణపతిశ్రమనివారణ భవాంబునిధితా
రణ మురాసురవిదారణ పరేశా। నీరధరసన్నిభశరీర నగరా
జనిభధీర తులసీవనవిహార భవనాశా॥౭౦॥ క॥ మృగజాతుండను
గావున। ఖగగమనుడ వీవటంచు గనజాలక నే। నొగి మిగుల
దప్పుజేసితి। నగధర యేలీల బాలనము జేసెదవో॥ వ॥ అని
యిట్లనేక విధంబులం బ్రార్థింప భల్లూకేశ్వరున కాలోకేశ్వ
రుండిట్లనియె॥ ఆ॥వె॥ భయము నొందవలదు భల్లూకనాయక।
పూర్వమందు నేను భూతలమున। రఘుకులంబునందు రాముడ
నై పుట్టి యున్నతరిని నీవునన్ను గొలచి॥ క॥ నాతో యుద్ధమొన
ర్పగ। బ్రీతిగలదటంచు నీ యభిప్రాయంబుల్। జేతోముదమున
దెల్పిన। నా తెరగున ముందుగల్గు నని వరమిడితిన్॥ క॥ ఆమా
ట నీవు మరచితి। వేమో తత్కారణమున నిప్పుడు మన కి। ట్లీ
మిషచే నని కల్గెను। నీమది భీతిల్లవలదు నిరుపమసుగుణా॥౭౨॥
చ॥ అన విని జాంబవంతుడు మహాముద మంది కరాంబుజంబు
లున్। మునుకొని మోడ్చి ఫాలమున మోపి నమస్కృతు లాచ
రించి స। య్యన నిజపుత్రికా తిలకమైదగు జాంబవతిన్ దటి
ద్ద్యుతిన్। దనరగ వాసుదేవునకు దారగ నర్పణజేసె భక్తి
తోన్॥ వ॥ అంత ద్వారకాపురంబున॥ క॥ నందయశోదాదులు
గో। విందుం డడవులకు నేగి వెస మసలుటకున్। డెందములందు
న మిక్కిలి। సందియమున్ బొందుచున్న సమయమునందున్॥
క॥ కాంతారత్నముతోడ శ। మంతకరత్నంబు గొనుచు మహి
జను లెన్నన్। సంతసమున వైదర్భి। కాంతుం డరుదెంచె ద్వా

రకాపురమునకున్॥ గీ॥ యిట్లు వచ్చినహరిగాంచి హితజనాప్త। బంధుముఖ్యులు సంతోషభరితులగుచు। వేడ్క వివిధోత్సవము లు గావించి రపుడు। హాటకాంబరు డమ్మరునాటిదినము॥ సీ॥ సకలభూపాలకపరికర బంధుహితాప్త విప్రభృత్యామాత్య వితతితోడ। సభచేసి కూర్చుండి సరగున దగువారినంపి సత్రాజిత్తు నచ్చటికిని। పిలపించి తగనర్హపీఠంబునందున గూర్చుండ నియమించి కుశలమడిగి। తత్సహోదరుని వార్తయు నాత డెరిగింప విని సభవారల గని మురారి॥ గీ॥ మోముదమ్మిని చిరునవ్వు మొలకలెత్త। బల్కె నీరీతి గంభీరభాషణముల। వినుడి సభ్యులు భువిలోన వింతవార్త। బుట్టె నీమధ్య మిగుల నద్భుతముగాగ॥
౮౦॥ వ॥ అదెట్టిదంటిరేని వివరించెద నాకర్ణింపుడు॥ క॥ వెనుకటికొకదినమున నను। గనుగొన నుల్లాసమొప్పగా నిచ్చటికిన్। ఘనయశు డీ సత్రాజి। జ్జననాథుడు వచ్చియున్న సమయమునందున్॥ క॥ ఈరీతిని గళమున సూర్యుని। భాతిని వెలుగొందుచున్న భవ్యమణిని నే। జేతోముదమున గోరిన। నాతో ని ట్లనియె నితడు నయమలరారన్॥ ఆ॥ వె॥ భానుడొసగినట్టి భవ్యరత్నంబిది। దీనివలన నాకు దినదినంబు। పసిడి దొరుకుచుండు పండ్రెండుబారువుల్। గనుక నియ్యజాల ననుచు బల్కె॥ గీ॥ అటుల బల్కిన పోనిమ్మటంటి నేను। పిదపనీతనితమ్ముడు ముదమెలర్ప। నమ్మణిధరించి యుత్తమాశ్వమ్ము నెక్కి। వేటకైబోయె నటఘోరవిపినములకు॥ క॥ ఆకరణి నేగి మరలన్। రాకున్నను దుఃఖసాగరనిమగ్నుండై। వైకల్యాత్మత నీ నృపు। డీకరణివచించెనట రహిన్ సభలోనన్॥ ౮౫॥ ఆ॥ వె॥ మాధవుండు నన్ను మణిగోర నే నటు। లియ్యకున్నదాన నీర్ష జేసి। నూమ కానుజన్ము మా

యుచే నడవిని। సంహరించి మణిని సంగ్రహించె॥ గీ॥ అటులగా
కున్న నితరుల కలవియగునె। మత్సహోదరు జెనకంగ మహి
తలమున। ననుచు ధీమంతుడైన యీ జనవరుండు। పల్కినాడట
భువినిది పాపమనక॥ క॥ ఆమాటలెల్ల గొందరు। ధీమతు లాలిం
చి నాకు దెల్పిన నెంతో। నామది చురుక్కుమని యెన్। భూమి
ని బలువై ననింద బొందితి ననుచున్॥ ఆ॥ వె॥ దీనినిజము నేను
పూనికతో బయల్। బుచ్చకూరకున్న వచ్చినట్టి। నింద దొలగ
దనుచు నిశ్చయంబొనరించి। గిరులు వనములెల్ల దిరిగి తిరిగి॥
సీ॥ శోధింపగా నొక్కచో బ్రసేనుడు జచ్చియుండుట నచ్చోట ను
రుమృగేంద్ర। పాదచిహ్నంబులు పరికించి మృగపతి యడుగుల
జాడ వెంబడినిరాగ। బరగ వేరొకచోట భల్లూకపదచిహ్నము
లును జచ్చినసింగమును గనుపడ। నీక్షించి భల్లూక మేగినజాడను
నడచి వేరొక్కచో నగబిలంబు॥ గీ॥ కాంచి తద్బిలమును జొచ్చి
కంటినచట। భానుకోటి ప్రభాభాసమానమగుచు। నొక్కబాలి
క డోలిక నెనరవ్రేలు।వరశమంతకమణి పుణ్యావశమువలన॥౯౦॥
వ॥ ఇట్లుగని సాహసంబున దద్రత్నంబు కేలంబట్టి తివియ న
బ్బాలిక బొబ్బలిడిన జాంబవంతుం డరుదెంచి కోపోద్దీపితుండై
నా యుదరంబునం బొడువ నే నతనిం దలపడితి నిట్లుడహోరా
త్రంబులు మేమిరువురమున్ బెనంగొన బలక్షీణుండై భల్లూకే
శ్వరుండు నన్నెరింగి మదీయచరణంబుల కెరగి తదీయరత్నవృ
త్తాంతం బంతయు నావలనం దెలిసికొని తత్కుమారీ రత్న
సహితంబుగ నీరత్నంబు సమర్పించె నని సవిస్తారంబుగ దెలి
యంబలికి సత్రాజిత్తుంగాంచి యిట్లనియె॥ క॥ జననాథోత్తమ
నీమణి। గొనుమిదె నేదీనికొరకు గూహకమున నీ। యనుజన్ము

ని జంపెడి దు। ర్జనుడనె నీవిట్లుపలుకజను నేధాత్రిన్॥ ఆ॥వె॥ దీ
ని నిజము నీకు దెలియవచ్చెనుగదా। నిజముదెలిసికొనక నింద
మోప। గూడదవనిలోన గుణవంతులకు౯ది। మానహానిసుమ్ము
మానవేంద్ర॥ క॥ అనిచెప్పి రత్నమిచ్చిన। గొని సత్రాజి న్నృ
పాలకుడు గృహమునకున్। జని తనమనమున నీవిధి। మునదల
చె భయంబు లజ్జ ముప్పిరి గొనగన్॥ క॥ మతిహీనత హరినిం
దిం। చితి నాకీ తప్పుదొలగ జేసికొనుటకున్। హితమతి నీమణి
తోనా। సుతనర్పణ జేతునేని సుముఖత దాల్చున్॥౯౯॥ క॥అని
నిశ్చయించి తత్క్షణ। మున సాలంకృతగ జేసి ముదమొప్పగ న।
య్యనదత్తరత్నయుతముగ। దనసుతయగు సత్యభామ దనుజి
తహేమన్॥ క॥ కొనివచ్చి ముకుందుని పద। వనజంబుల కెర
గి హస్తవనజయుగంబున్। మునుకొని ముకుళించి మహా। విన
యత నీగతిని విన్నవించెన్ హరికిన్॥ గీ॥దేవ భవదీయమహిమ
నే దెలియలేక। మందబుద్ధిని మిమ్ముల నిందజేసి। నాడ నాత
ప్పు మన్నించి నాదుదుహిత్రు। మణియుతముగా శమంతకమణి
నిగొనుము॥ వ॥ అని సవినయంబున బల్కి మిత్రదత్తరత్నస
హితంబుగ బుత్రికారత్నంబును సమర్పించిన నందనందనుండు
డెందంబునం దమందానందంబు నొంది మందస్మితవదనారవిం
దుండగుచు నానృపపురందరున కిట్లనియె॥ క॥ ఈమణినాకేటికి
గొను। మా మురలన్నృపాల నీవు మది సంశయ మిం। కేమాత్ర
ముంచ కీ భా। మామణియే జాలు కోటుమణులవిలువ యా॥
౧౦౦॥ వ॥ అని యిట్లయ్యాదవేంద్రుండు సాదర పూర్వకంబు
గా బల్కిన సమ్మోదమాన మానసుండై మేదినీకాంతుండు మ
ణింబుచ్చికొని కుమారికామణి నయ్యదుకులాబ్ధిమణికిన్

లంకృత కన్యాదాన పూర్వకంబుగా నుద్వాహం బొనర్చె నని
సూతుండు శౌనకాద్యఖిలమునులకుం జెప్పి మరియు నిట్లనియె॥
షట్పదసీసము॥ మునులార వినుడి శ్రీగణనాథుని చరిత్ర మెవ్వరు
జదివిన నెవరు వినిన । నెవ్వరు వ్రాసిన నిలభాద్రపదమాస పూ
ర్వచతుర్థి సోముని గనియెడునట్టిదోషము బాయు నదిగాక తమ
తమ వివిధకార్యములు నిర్విఘ్నముగను । సిద్ధిజెందునటంచు జె
ప్పిన మునులెల్ల నానందచిత్తులై మానివరుని । మిక్కిలి గొని
యాడి గ్రక్కున దమతపోవనముల కేగిరి వాసిమీర । వనజ
సంభవనేత్ర వసుచంద్రసంఖ్యాక శాలివాహన మహాశకము
నందు॥ గీ॥ శ్రీకరంబౌ ప్లవంగాబ్ద జ్యేష్ఠశుక్ల । పక్షమున పంచ
మీతిథి భానువార । మునకు నీకృతి నే బూర్ణముగ రచించి ।
మహిసమర్పించితిని హనుమంతునకును॥ చ॥ పవనతనూజ రా
మపదపంకజభృంగ దినేశతేజ దై । త్యవనకుఠార రావణసుతస్మ
యభంగ సరోజమిత్రసం । భవసచివాగ్రగణ్య నతపాల వనాటవ
రేణ్య దేవతా । నివహనుతప్రతాప ధరణీసుతశోకవినాశకార
ణా॥ స్రగ్విణి॥ అంజనీగర్భదుగ్ధాబ్ధిసోమా లస । త్కంజపత్రేక్ష
లోకత్రయీవందితా । భంజితానూనదుర్భావ దైత్యవ్రజా । కం
జమిత్రోపమాఖండతేజోనిధీ॥ ౧౦౫॥ ... ...

గద్య॥ ఇది శ్రీపరమేశ్వరీచరణారవిందమరందపానామందానం
దతుందిలేందిందిరాయమాణాంతరంగ శ్రీమత్తోలేటివంశపయః
పారావారరాకాసుధాకర భారద్వాజసగోత్రపవిత్ర భాగయా
మాత్యపుత్ర సకలవిద్వజ్జనవిధేయ సీతారామయాభిధేయవిరచి
త గణనాథాభ్యుదయంబను పుణ్యచరిత్రంబునం దుత్తరభాగము॥

